వి. బియాంకి

# అడవిలో ఇళ్లు

చిత్రాలు: ఎమ్. మితురిచ్





"రాదుగ" ప్రచురణాలయం
మాస్కో



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్

**В. Бианки**

ЛЕСНЫЕ ДОМИШКИ

*На языке телугу*

**V. Bianki**

FOREST HOMES

*In Telugu*





సోవియట్ యూనియన్‌లో ముద్రింపబడింది

ISBN 5-05-002041-7

## యిందులో:



# అడవిలో ఇళ్లు

నదికి పైన యెత్తులో వో కొండ కూచిగా వుంది. దాని శిఖరంమీద చిన్న స్వాలో పక్షులు వొక దాన్ని వొకటి తరుముకుంటూ, కీచుమని అరుస్తూ, కూస్తూ చక్కర్లు కొడుతున్నాయి. అవి దాగుడుమూతలు ఆడుకుంటున్నాయి.

బుజ్జి స్వాలో పిట్ట వొకటి చాలా వేగంగా యెగురుతూ వుంది. గుంపులో వున్న యితర పక్షులేవీ దాన్ని పట్టుకోలేకపోయాయి. అది యెప్పుడూ గబుక్కున కిందికి దిగనేనా దిగేది, లటుక్కున జారిపోనేనా జారిపోయేది.

బుజ్జి స్వాలోని యెవరు తరిమినా గానీ అది యిటూ అటూ యెగిరిపోయేది, పైకీ కిందికీ యెగిరేది; చాలా వేగంగా దూసుకుపోయేది, వొక్క నిముషం కూడా అది రెకల్ని కదల్చడం ఆపేది కాదు.

హఠాత్తుగా వినీల ఆకాశంలో వొక డేగ కనిపించింది. దాని రెక్కలు కోసుగా వంపు తిరిగి వున్నాయి. ఆ రెక్కల యీకల్లోనుంచి గాలి దూసుకు వస్తూ వుంటే యీల వేసినట్టు చప్పుడు అయింది.

స్వాలో పక్షుల గుంపు వణికి పోయింది. అవి వెంటనే చెల్లాచెదురైపోయాయి. ఒకోటీ ఒకో దారిలో యెగిరి పోయాయి. రెప్ప మూసి తెరిచేటంతలో అవి కనిపించకుండా పోయాయి.

బుజ్జి స్వాలో పక్షి నదిమీద, అడివిమీద, ఆవల వున్న సరస్సుమీదా యెగిరిపోతూ యెగిరిపోతూ వెనక్కి తిరిగి చూసిందే కాదు.

డేగతో దాగుడు మూతలాడ్డం చాలా ప్రమాదం, మరి.

బుజ్జి స్వాలో యెగిరీ, యెగిరీ సత్తువంతా పోయిందాకా యెగురుతూనే వుంది.



అప్పుడు తిరిగి వెనక్కి చూసింది. యెవళ్ళూ తనని తరమడం లేదు. అది చుట్టూ చూసింది. చుట్టూతా అంతా కొత్తగా వుంది. తను పరాయి చోట తేలింది. కిందికి చూస్తే నది వుంది. కాని అది తనకి తెలిసిన నది కాదు. దాన్ని అంతకు ముందెన్నడూ తను చూసి యెరగదు.

బుజ్జి స్వాలోకి భయం వేసింది.

యింటికి వెళ్ళే దారి మర్చిపోయింది. దానికి యెంత భయం వేసిందంటే తన చుట్టూతా యేం వుందో చూడ్డానికి కూడా ధైర్యం చిక్కింది కాదు.

అప్పుడు పొద్దు వాలుతోంది. కొంచెం సేపట్లో సాయంత్రం అవుతుంది. తనేం చెయ్యాలి?

దానికి భయంవేసింది.

అది కిందికి దిగి ఒడ్డున కూర్చుని వెక్కి వెక్కి యేడ్చింది.

యింతట్లోకే నల్లని మెడపట్టీ వున్న పసుపుపచ్చ పిట్ట వొకటి యిసకమీద పరిగెత్తుకుంటూ రావడం దానికి కనిపించింది.

దాన్ని చూస్తే బుజ్జి స్వాలోకి ప్రాణం లేచొచ్చింది.

"మా యింటికి యెలా వెళ్ళాలో దారి చెప్పవూ?" అని దాన్ని అడిగింది.

"యెక్కడినుంచి వొచ్చేవు?"

"నాకు తెలీదు."

''నీ యిల్లెక్కడుందో తెలీకపోతే పట్టుకోవడం కష్టమే. సూర్యాస్తమయం అయిపోతుంది, చీకటి పడుతుంది. మా యింట్లో వుండకూడదూ? నన్ను ప్లావర్ పిట్ట అంటారు. మా యిల్లు యిక్కడికి దగ్గర్లోనే వుంది'' అని ఆ పిట్ట చెప్పింది. దాని కాళ్లు పొడుగ్గా వుంటాయి, తోక పొట్టిగా వుంటుంది.

ప్లావర్ పిట్ట కొన్ని అడుగుల దూరం పరిగెత్తివెళ్లింది. ముక్కుతో యిసిక కేసి చూపించింది. తర్వాత వొంగి, కదురులాంటి కాళ్లమీద వూగింది. ''యిదే మా యిల్లు, లోపలికి రా'' అంది.

బుజ్జి స్వాలో పరీక్షగా చూసింది కాని యిల్లులాంటిది యేదీ దానికి కనిపించలేదు. కనిపించినవల్లా యిసికా, గులక రాళ్లూనూ.





''కనిపించలా? యిక్కడ, యిదిగో గుడ్లు వున్న చోట.''

బుజ్జి స్వాలోకి యిసకమీద గులక రాళ్ల మధ్య మచ్చలున్న నాలుగు గుడ్లు ఆఖరికి కనిపించాయి.

''యేమిటి? మా యిల్లు నీకు నచ్చలేదా?''

బుజ్జి స్వాలోకి యేమనాలో తోచలేదు. అసలది యిల్లే కాదు పొమ్మంటే ప్లావర్ పిట్ట నొచ్చుకుంటుం దేమో, అందుకని.

''పైన కప్పూ గిప్పూ యేమీ లేకుండా ఆరు బయలు చల్లని యిసికమీద పడుకోవడం నాకు అలవాటు లేదు'' అని అంది.

''అయ్యొయ్యొ! కష్టమే! అయితే ఆ ఫర్ తోపులో పావురాయి యిల్లు వుంది. పోనీ అక్కడ అడిగి చూడు. వాళ్ల యింటికి నేల వుంది. యీ రాత్రి అక్కడ గడపవచ్చు నువ్వు'' అంది ప్లావర్ పిట్ట.

''సరే, మరి'' అంది బుజ్జి స్వాలో.

ఫర్ తోపు దగ్గరికి యెగిరివెళ్లింది.

పెద్ద శ్రమ పడక్కర్లేకుండానే పావురాయి యిల్లు కనిపించింది. ఆ రాత్రి తనని అక్కడ వుండనియ్యమని బుజ్జి స్వాలో పావురాయిని అడిగింది.

''దానికేం మహా భాగ్యం, నీకు మా యిల్లు నచ్చితే'' అంది పావురాయి.

నిజం చెప్పాలంటే ఆ యింటికి వున్నదల్లా నేల మాత్రమే. అంతకి తప్పిస్తే జల్లెడలా అన్నీ కంతలే. పావురాయి వూరికే యెలా పడితే అలా కొమ్మలమీద కొన్ని పుల్ల ముక్కలు పడేసిందంతే. ఆ పుల్ల ముక్కలమీద కొన్ని తెల్లని గుడ్లు వున్నాయి. నేల కంతల్లోనుంచి అవి కనిపిస్తాయి.

బుజ్జి స్వాలోకి ఆశ్చర్యం కలిగింది.

''యిక్కడున్నదల్లా నేల మాత్రమే. మీ యింటికి గోడల్లేవు. యిక్కడెలా పడుకుంటారు?'' అని అడిగింది.

''వూఁ, సరే అయితే. నీకు గోడలున్న యిల్లు కావాలంటే ఓరియోల్ పిట్ట యింటికి వెళ్లు, నీకది నచ్చవచ్చు'' అంది.



పావురాయి ఆ యింటి చిరునామా బుజ్జి స్వాలోకి చెప్పింది: బర్చ్ తోపులో చాలా అందంగా వున్న బర్చ్ చెట్టు పైన వుందా యిల్లు.

బుజ్జి స్వాలో బర్చ్ తోపు దగ్గరికి వెళ్లింది.

దాని కంటికి అక్కడ వున్న బర్చ్ చెట్లన్నీ అందంగానే కనిపించేయి. అది ఓరియెల్ యింటి కోసం చాలా వెతికింది. ఆఖరికి వో చిన్న కొమ్మమీద వున్న ముచ్చటైన చిన్న యిల్లు కనిపించింది. ఆ యిల్లు చాలా సౌకర్యంగా వున్నట్టు కనిపించింది. చక్కటి బూడిద రంగు కాగితం ముక్కలతో చేసిన గులాబీలా వుందది.

''యెంత చిన్న యిల్లుంది ఓరియెల్‌కి! నాకు యిక్కడ చోటు సరిపోదు'' అనుకుంది బుజ్జి స్వాలో.

అయినా పోనీ చూద్దాం అనుకుని తలుపు తట్టింది. ఆ యింట్లోనుంచి 'ఝు'మ్మంటూ కందిరీగలు దండుగా వచ్చేయి.

అవి మూగిపోయి కోపంగా 'ఝు'మ్మన్నాయి. బుజ్జి స్వాలోని కుడతాయేమో నన్నట్టు కనిపించాయి.

బుజ్జి స్వాలోకి భయం యెక్కువై పరుగు లంకించుకుంది.

ముదురాకుపచ్చ ఆకులగుండా యెగురుకుంటూ పారిపోయింది.

వున్నట్టుండి బంగారు రంగూ నలుపు రంగూ కలిసి వున్నది యేదో పక్కన తళుక్కని మెరిసింది.

అప్పుడు బుజ్జి స్వాలో వో కొమ్మమీద నల్లని రెక్కలున్న బంగారు పిట్టని గుర్తుపట్టింది.

''యేమిటంత హడావుడిగా పోతున్నావ్ బుజ్జి స్వాలో'' అని ఆ పిట్ట అడిగింది.

''నేను ఓరియెల్ పిట్ట యింటి కోసం చూస్తున్నాను.''

''నేనే ఓరియెల్‌ని. నా యిల్లిక్కడే యీ అందమైన బర్చ్ చెట్టుమీద వుంది.''







బుజ్జి స్వాలో చుట్టూతా చూసింది. చెట్టు తెల్లని కొమ్మలూ, ఆకుపచ్చ ఆకులూ తప్ప యేం కనిపించ లేదు. బాగా పరికించి చూసేక అయ్యో అని ఆయాస పడింది.

నేలకి పైన వో కొమ్మకి చొక్కా జేబులాంటి చిన్న బుట్ట తగిలించి వుందంతే. దారం పోగులు, గడ్డి పరకలు, వూలు, వెంట్రుకలు, పల్చని కాగితంలాంటి బర్చ్ బెరడు అన్నిట్నీ పోగు చేసి అందంగా అల్లినట్టు వుంది అది.

''చాలు! చాలు! యిలాంటి అల్కా యింటిలో నేను చచ్చినా వుండను! గాలిలో వూగుతూ వుంటుందిది, నాకు తల తిరిగిపోతుంది. యే క్షణంలోనేనా టుప్పున యెగిరి పోయేటట్టు వుంది యిది. పైగా పైన కప్పు లేదా యిరి'' అంది బుజ్జి స్వాలో.

బంగారు ఓరియెల్ కష్ట పెట్టుకున్నట్టు కనిపించింది. ''అయితే షిఫ్‌షాఫ్ అనే శ్రావ్యంగా కూసే

పక్షి యింటికి వెళ్లు. ఆరుబయట పడుకోడానికి నీకు భయమైతే బహుశా దాని గుడారం నచ్చుతుందేమో. ఆ గుడారానికి కప్పు వుంది.''

బుజ్జి స్వాలో షిఫ్‌షాఫ్ పిట్ట యింటికి బయల్దేరింది.

ఓరియెల్ పిట్ట వూగులాడే బుట్ట యిల్లు వున్న బర్చ్ చెట్టుకింద గడ్డిలో పసుప్పచ్చ షిఫ్‌షాఫ్ పిట్ట వుంటోంది.

బుజ్జి స్వాలోకి దాని గుడారం నచ్చింది. ఎండిపోయిన గడ్డి, నాచు పెట్టి దాన్ని కట్టుకుందది. ''యేం హాయిగా



వుందిది. దీనికి యెంచక్కా నేల వుంది, గోడలు వున్నాయి. కప్పు వుంది. యీ ఆకల పరుపు వుంది. అచ్చం మా యింటికి లాగానే వుంది'' అంది.

తోడు దొరికింది కదా అని షిఫ్‌షాఫ్ పిట్ట సంబర పడింది. యెక్కడ పడుకోవచ్చో బుజ్జి స్వాలోకి చెప్తాం దంతే, నేల అదరడం మొదలుపెట్టింది. బుజ్జి స్వాలోకి వొణుకు పుట్టింది. మెడ చాచి ఆ ఉరుముల చప్పుడేమిటో వింది.

"ఆ, యేం లేదు. కొన్ని గుర్రాలు తోపు దగ్గరికి దౌడు తీసుకుపోతున్నాయి'' అని షిఫ్‌షాఫ్ పిట్ట చెప్పింది.





“గుర్రాలు తొక్కితే నీ యిల్లు కూలిపోదూ?”

షిఫ్‌షాఫ్ పిట్ట విచారంగా యేం చేస్తాం మరి అన్నట్టు తల వూపింది.

“అయ్య బాబోయ్! యిదేం చోటురా నాయనా!” అని బుజ్జి స్వాలో గుడారంలోనుంచి యివతలికి దూసుకు వచ్చేసింది. “నీకో దణ్ణం! యిలాంటి చోట రెప్ప మూత పడుతుందా నాకు, క్షణక్షణం యెక్కడ చచ్చిపోతా మోనని భయం వుంటే. మా యిల్లు చాలా భద్రంగా వుంటుంది. వొకళ్లు తొక్కుతారనీ, నేలకేసి కుదుముతారనీ భయం లేదు” అంది.

“మీ యిల్లు బహుశా గ్రెబె పిట్టల యిళ్లల్లాంటిదై వుంటుంది. వాళ్ల యిల్లు చెట్టుమీద లేదు, అంచేత గాలికి కొట్టుకుపోదు, నేలమీదా కాదు, అంచేత యెవళ్లూ తొక్కరు. యేం, నిన్నక్కడికి తీసుకెళ్లమంటావా?”

“వూఁ.”

అవి రెండూ గ్రెబె పిట్ట కోసమన్చెప్పి యెగిరివెళ్లాయి.

అవి సరస్సు దగ్గరికి వెళ్లాయి. అక్కడ వో రెల్లు పొదల ద్వీపం కనిపించింది. దాని చుట్టూతా నీళ్లు ఆవరించి వున్నాయి. అక్కడ వుంది వో పెద్ద తల పక్షి, దాని తలమీద చిన్న చిన్న కొమ్ముల్లా పైకి లేచి వున్నాయి యీకలు.

ఆ కొమ్ముల్లాంటి యీకలున్న పక్షిని ఆ రాత్రికి వుండనియ్యమని అడుగు అని బుజ్జి స్వాలోకి షిఫ్‌షాఫ్ పిట్ట చెప్పింది. ఆ తర్వాత తను సెలవు తీసుకుని వెళ్లిపోయింది.

బుజ్జి స్వాలో సరస్సు మధ్యలో వున్న ద్వీపం దగ్గరికి వెళ్లింది. ఆ ద్వీపం తేలుతోంది. అది చూసి దానికి ఆశ్చర్యం కలిగింది. నీళ్లమీద అటూ యిటూ వూగే యెండు రెల్లు మోపు అది. ఆ మోపు మధ్యలో కంత వుంది. ఆ కంతలో మెత్తటి బాడవ గడ్డి పరిచి వుంది. దానిమీద గ్రెబె పిట్ట పెట్టిన గుడ్లు వున్నాయి. వాటిమీద సన్నని యెండు రెల్లు పరకలు కప్పి వున్నాయి.

తేలుతూ వుండే ఆ ద్వీపం అంచున గ్రెబె పిట్ట కూర్చుంది. ఆ ద్వీపం యేదో తెప్ప అయినట్టుగా దానిమీద సరస్సులో ప్రయాణం చేస్తూ వుందది.

ఆ రాత్రి గడిపేందుకు చోటు కోసం తను వెతుకుతున్నానని బుజ్జి స్వాలో గ్రెబె పిట్టతో చెప్పింది. ఆ ద్వీపం మీద వుండడానికి వీలవుతుందేమోనని అడిగింది.

''అలలమీద పడుకోగలవా, భయమేస్తుందా?''

''కాని రాత్రిళ్లప్పుడు వొడ్డున దీన్ని కట్టేసుకోవూ?''

''నా యిల్లేమన్నా పడవనుకున్నావా యేమిటి? గాలి యెటు వీస్తే అటు పోతుందిది. అంచేత రాత్రి తెల్లవార్లూ వూగుతూ వుంటాం, వెనక్కీ ముందుకీ కదులుతూ వుంటాం.''

''అయ్యో బాబోయ్! నాకు భయం. యింటికి పోతా.''

గ్రెబె పిట్టకి కోపం వచ్చింది.





“ఉఫ్! మరీ ఘూకరాలు పోకు. నీకు యేదీ వో పట్టాన నచ్చేటట్టు లేదు. దయచెయ్యి, నీ యిష్టం వొచ్చిన చోటికి వెళ్లు” అంటూ అది బుజ్జి స్వాలోని తరిమేసింది.

బుజ్జి స్వాలో యెగిరిపోయింది. దానికి వొకటే యేడుపు వొచ్చేస్తోంది.

వో పక్కనేమో చీకటి పడిపోతోంది. కొంచెం సేపట్లో అది వో దట్టమైన అడివి దగ్గరికి చేరుకుంది. పొదు గాటి వో ఫర్ చెట్టు పెద్ద కొమ్మమీద దానికి వో యిల్లు కనిపించింది.

అది గుండ్రంగా వుంది. పుల్లలతోనూ, కొమ్మలతోనూ కట్టిన యిల్లు అది. లోపల వెచ్చగా వుండే మెత్తని నాచుతో గచ్చు చేసి వుంది.

“హమ్మయ్య! యిదీ నేను వెదికేలాంటి యిల్లు. దిట్టంగా వుంది, దీనికి కప్పు వుంది.”

బుజ్జి స్వాలో ఆ పెద్ద యింటికి యెగిరివెళ్లింది. ముక్కుతో గోడమీద తట్టింది. “యీ రాత్రికి నన్నిక్కడ తల దాచుకోనియ్యరూ” అని జాలిగా అడిగింది.

హఠాత్తుగా భయం కలిగించే జేగురు రంగు బొచ్చు తల వొకటి యివతలికి వచ్చింది. దానికి పెళుసుగా వుండే మీసాలున్నాయి. పసుప్పచ్చని పళ్లు వున్నాయి.

"యిదెప్పట్నుంచి? రాత్రి తల దాచుకోనిమ్మని అడుగుతూ పిట్టలు ఉడతల యిళ్ల తలుపు తట్టడం యెప్పట్నుంచీ అంట?" అని ఆ దయ్యం గుర్రుమంది.

బుజ్జి స్వాలోకి భయంతో పై ప్రాణం పైనే పోయింది. అది కొరడు బారిపోయింది. సయ్యన దూసుకు పోతూ అడివి పైన యెగిరింది. రెక్కల్లో సత్తువ మేరకి యెగురుతూ వొక్క క్షణం కూడా వెనక్కి చూళ్లేదు.

ఎగిరీ, ఎగిరీ యిక దానికి శక్తి లేకపోయింది. వెనక్కి చూద్దామని అటు తిరిగింది. చిత్రం! యెవళ్లూ తనని తరిమి కొట్టడం లేదు. కిందికి చూసింది. నది కనిపించింది. అదుగో అరె, తన నదే అది.

నదిమీదకి జయ్యన దూసుకు వెళ్లింది. అక్కణ్నుంచి నిట్రపాటి కొండ శిఖరం చివరకంటా యెగిరింది.

అక్కడ అదృశ్యం అయిపోయింది.

కూచి కొండ పక్క భాగంలో కంతలు వున్నాయి. ఒకో కంతా ఒకో స్వాలో పిట్ట గూడు. బుజ్జి స్వాలో వో కంతలోకి దూరింది. దానిలోకి చొచ్చుకుపోయి, బాగా సన్నగా వున్న సొరంగంలోకి పోయింది. దాని చివరకంటా పోగానే అక్కడ గుండ్రంగా విశాలంగా వున్న జాగా వచ్చింది.

అక్కడ వాళ్ల అమ్మ దాని కోసం యెదురు చూస్తోంది.

అలిసిపోయిన బుజ్జి స్వాలో ఆ రాత్రి యెండు గడ్డితో, గుర్రపు వెంట్రుకలతో, యీకలతో చేసిన తన వెచ్చని మెత్తని పరుపుమీద ఆదమరిచి నిద్రపోయింది.

గుడ్ నైట్!





# యెర్ర గుట్ట

చిక్ యెర్ర తలకాయ పిచిక. అతనికి యేడాది వయసు వస్తూనే చిరికాను పెండ్లి చేసుకున్నాడు, సొంత యిల్లు కట్టుకోవాలని అనుకున్నాడు.

చిరికా పిచికల భాషలో అన్నది: "చిక్, మన గూడు యెక్కడ కట్టుకుందాం? చూసినావా, మన తోటలోని చెట్ల తొర్రలన్నీ యిప్పటికే నిండిపోయినాయి."

"పరవా లేదులే!" అన్నాడు చిక్. సహజంగానే, అతను కూడా పిచికల భాషలోనే మాట్లాడినాడు. "మన పొరుగువాళ్లను వాళ్ల యింట్లోనుండి తరిమేద్దాం, వాళ్ల చెట్టు తొర్రను ఆక్రమించుకుందాం."

చిక్‌కు కొట్లాటంటే మహా యిష్టం. చిరికాకు తన ధైర్యం చూపించడానికి యింత మంచి అవకాశం దొరికినందుకు అతనికి సంతోషం కలిగింది. పిరికి చిరికా అతన్ని ఆపేలోపలే అతను తాను కూర్చున్న చెట్టు కొమ్మమీదనుండి యెగిరి, పెద్ద రొవాన్ చెట్టుమీదికి పోయినాడు. దాని తొర్రలో చిక్ యీడువాడే అయిన మరొక పిచిక కాపుర ముండేవాడు. ఆ సమయంలో అతను యింట్లో లేడు.

"తొర్రలో ప్రవేశిస్తాను" అనుకున్నాడు చిక్. "యజమాని వస్తే, నన్ను నా యింట్లోనుండి తరిమేయడానికి అతను ప్రయత్నిస్తున్నాడని కేకలు వేస్తాను. అప్పుడు పెద్ద పిచికలన్నీ యిక్కడికి వచ్చి, అతన్ని బాగా తన్ని పంపిస్తారు."

కానీ, తన పొరుగువానికి పెండ్లైందనీ, అతని భార్య అప్పటికే అయిదు రోజులుగా ఆ చెట్టు తొర్రలో

---

గూడు కట్టుతూవుందనీ చిక్ పూర్తిగా మరచిపోయినాడు.

అతను తొర్రలోకి తల దూర్చగానే అతని ముక్కుమీద యెవరో పొడిచినారు. అతను బాధతో కీచుమంటూ వెనక్కి యెగిరినాడు. సరిగ్గా అదే సమయంలో అతని పొరుగువాడు వెనకనుండి అతనిమీద దాడిచేసినాడు. యిద్దరూ గాలిలో కలబడి, నేలమీద పడి, ఒక గుంతలోకి దొర్లినారు.

చిక్ కొట్లాటలో మంచి నేర్పరి. అతని పొరుగువాడు ఓడిపోతూవుండినాడు.

యింతలో యీ కలకలం విని పెద్ద పిచికలు అక్కడికి వచ్చినాయి. తప్పు యెవరిదైందీ వాళ్లకు వెంటనే అర్థమైంది. అందరూ కలిసి చిక్‌ను చావదన్నినారు. అతను కంపరమెత్తి పారిపోయినాడు.

అతనికి యేదో పొదలో స్పృహ వచ్చింది. ఆ పొద అతనెన్నడూ యెరగనిది. అతనికి ఒళ్లంతా సలుపుతూ వుండింది.



చిరికా భయంతో పక్కన కూర్చొని వుండింది.

"చిక్" అన్నది చిరికా. ఆమె కంఠంలో యెంత దుఃఖం వుండిందంటే, పిచికలకు యేడ్వడం చేతనై వుంటే చిక్ భోరున యేడ్చేవాడే. "చిక్, మన మింక మన తోటకు వెళ్లనే వద్దు. మరి మన సంతానాన్ని యెక్కడ పొద గాలి యిప్పడు?"

తాను పెద్ద పిచికల కంటబడకూడదని చిక్ కూడా అనుకున్నాడు. కనిపిస్తే అవి తనను చంపేస్తాయి. కాని తాను భయపడినట్లు చిరికా కనిపెట్టడం అతనికి యిష్టం లేదు. అతను చెదరిన యీకలు సర్దుకొని, ఆయాసంనుండి కాస్త తేరుకొని, అన్నాడు:

"పరవా లేదులే! అంతకంటె మంచి తావు దొరుకుతుంది మనకు."

కొత్త తావు కోసం వెదకుతూ యిద్దరూ బయలుదేరినారు.

వాళ్ల కొక అందమైన నీలి నది కనిపించింది. నది కావల పెద్ద గుట్ట వుండింది. యెర్ర మట్టీ, యిసుకా వున్న గుట్ట అది. గుట్టపైన, పేటు వద్ద లెక్క లేనన్ని బొరియలు కనిపించినాయి వాళ్లకు. పెద్ద బొరియల దగ్గర కాకులూ, గద్దలూ కూర్చొనివుండినాయి. చిన్న బొరియలలోనుండి స్వాలో పిట్టలు బయటికి వస్తూ, లోపలికి పోతూ వుండినారు. పేటుపైన తెల్ల స్వాలో పిట్టల గుంపు చిన్న మేఘంలాగ ఆడుతూ వుండింది.

"అవి యెంత హాయిగా వున్నాయో చూడు!" అన్నది చిరికా. "యెర్ర గుట్టమీద మనమూ గూడు కట్టుకుందాం."

చిక్ పిచిక కాకులనూ, గద్దలనూ సంకోచంతో చూసింది. అతను యిలా అనుకున్నాడు: "స్వాలోలకు సులభం. అవి తమ బొరియలు తామే తవ్వుకున్నాయి. యెవరో కట్టుకున్న గూటి కోసం నేను పోరాటం చేయాలీ?" అనే ఆలోచనతో వెంటనే చిక్‌కి మళ్లీ ఒళ్లు సలపసాగింది.

"యిది నాకు నచ్చదు" అన్నాడు అతను. "యింత రణగొణ గోలలో చెవులు చిల్లులు పడతాయి."

వాళ్లు యెగిరి యింకా ముందుకు పోయినారు.

వాళ్ల కొక వనమూ, దాని కవతల ఒక చిన్న యిల్లూ కనిపించినాయి. యింటి పక్కన కొయ్య పలకలతో కట్టిన గుడిసె వుండింది.

చిక్, చిరికా గుడిసె కప్పుమీద కూర్చున్నారు. అక్కడ పిచికలూ, స్వాలోలూ లేవని చిక్ వెంటనే గమనించినాడు.

"యిక్కడ మనం సుఖంగా బతకవచ్చు!" అన్నాడు చిక్ ఉల్లాసంగా. "యింటి చుట్టూ గింజలూ, తిండి సామగ్రీ యెలా వున్నాయో చూడు! యిక్కడ మనం ఒంటిగా వుందాం, యెవరినీ దగ్గర చేరనివ్వకుండా."

''చిక్, అటు చూడు'' అన్నది చిరికా. ''వాకిలి ముందర యెంత భయంకరమైన జంతువో!''

చిరికా చెప్పింది నిజమే. వాకిలి ముందర పెద్ద, బలిసిన యెర్ర పిల్లి నిద్రపోతూ వుండింది.

''పరవా లేదు!'' అన్నాడు చిక్ ధైర్యంగా. ''యీ పిల్లి మనల్నేం చేస్తుంది? దీన్ని జడిపిస్తాను చూడు!''

చిక్ సర్రున పిల్లి వైపు దూసుకపోయినాడు. ఆ వేగానికి చిరికా కూడా భయంతో కీచుమన్నది.

చిక్ క్షణంలో పిల్లి మూతి దగ్గరున్న రొట్టె ముక్కను ముక్కున కరచుకొని, వెంటనే గుడిసె కప్పుమీదికి తిరిగివచ్చినాడు.

పిల్లి కదలనైనా కదలలేదు. అతను ఒక కన్ను మాత్రం తెరచి, తుంటరి పిచికను గమనించినాడు.

''చూసినావా?'' అన్నాడు చిక్ బడాయిగా. ''అతన్ని చూస్తే నీ కింకా భయమేనా?''



చిరికా అతనితో వాదించలేదు. గూడు కట్టుకోడానికి అనువైన స్థలం కొరకు వాళ్ళు వెదక సాగినారు.

గుడిసె కప్పుకింద విశాలమైన సందును వాళ్ళు యెన్నుకొని, గడ్డి పరకలూ, గుర్రపు వెంట్రుకలూ, పక్షుల యీకలూ, మొదలైనవి అక్కడికి తేసాగినారు.

వారం తిరక్క ముందే చిరికా తమ గూటిలో మొదటి గుడ్డు పెట్టింది. గుడ్డు చిన్నది — యెరుపు, తెలుపు పొడలు గలది. చిక్కు యెంతో ఆనందమైంది. ఆ ఆనందంలో అతను తన భార్య గౌరవార్థమూ, తన గౌరవార్థమూ ఒక పాట కూడా కట్టినాడు:



"కిచకిచ కిచ్
కిచకిచ కిచ్
కిచకిచ కిచకిచ
కీచుకీచు కిచ్!"



యీ చిన్న పాటకు బొత్తిగా అర్థం లేదు, కానీ కంచెమీద అటూ యిటూ యెగురుతూ పాడుకోడానికి యెంతో అనుకూలమైనది.

ఆరు గుడ్లు పెట్టిన తర్వాత చిరికా పొదగడం ప్రారంభించింది.

చిరికాకు పురుగులూ, యీగలూ పట్టుకురావడానికి చిక్ యెగిరిపోయినాడు. యెందుకంటే, పొదిగేటప్పుడు చిరికాకు మెత్తని, రుచికరమైన ఆహారం అవసరం. చిక్ యింకా రాలేదేమో అని చిరికా బయటికి వచ్చి చూడా లనుకుంది.

సందులోనుండి చిరికా బయటికి తొంగిచూడగానే, పదునైన గోర్లు గల పెద్ద పంజా కప్పుమీదనుండి వచ్చి ఆమె యీకలు పట్టుకుంది. చిరికా తటాలున గుంజుకొని తప్పించుకుంది. పిల్లి పంజాలోకి పిడికెడు యీకలు వచ్చినాయి. చిరికా ఒక క్షణం ఆలస్యం చేసివుంటే, పిల్లికి దొరికిపోయేదే.

చిరికా పారిపోవడం చూసి పిల్లి సందులోకి పంజా దూర్చి, గడ్డితో, యాకలతో నిర్మించిన గూడు నంతటినీ బయటికి లాగినాడు. చిరికా యెంత మొత్తుకున్నా లాభం లేకపోయింది. అప్పుడే తిరిగి వచ్చిన చిక్ ధైర్యంగా పిల్లి మీద దాడిచేసినాడు, కానీ లాభం లేకపోయింది. వాళ్ల కెవరూ సాయం రాలేదు. అమూల్యమైన ఆరు గుడ్లనూ యెర్ర దొంగ తినేసినాడు. వుత్త గూడు గాలికి కొట్టుకపోయింది.

ఆ రోజే పిచిక లిద్దరూ గుడిసెను శాశ్వతంగా వదలి, వనంలో చేరినారు, యెర్ర పిల్లికి సాధ్యమైనంత దూరంగా వుండాలని.

వనంలో వాళ్ల అదృష్టం బాగుండింది. త్వరలోనే వాళ్ల కొక ఖాళీ చెట్టు తొర్ర కనిపించింది. వాళ్ళు గడ్డి పరకలూ, అవీ యివీ తెచ్చి, ఆ వారమంతా కష్టపడి గూడు కట్టుకున్నారు.





వాళ్ల యిరుగు పొరుగున గోరువంక దంపతులూ, పాలపిట్ట దంపతులూ, కవుజు దంపతులూ వుండినారు. ప్రతి జంటకూ వాళ్ల సొంత యిల్లు వుండింది. అందరికీ తిండి సమృద్ధిగా వుండింది. కానీ, చిక్ కేవలం తన ధైర్యమూ, బలమూ చూపించడానికి పొరుగువాళ్లతో కొట్లాటలు పెట్టుకున్నాడు.

కానీ గోరువంక చిక్‌కంటె బలశాలి. అతను చిక్‌ను బాగా తన్ని పంపించినాడు. అప్పటినుండి చిక్ కాస్త జాగ్రత్తగా వుండినాడు. యిరుగు పొరుగులు దగ్గర వున్నప్పుడు అతను ఈకలు లేపి, యుద్ధ వీరుని లాగా కిచ కిచమని మాత్రం అనేవాడు. కానీ వాళ్లది పట్టించుకోలేదు — తమ బలం గురించీ, ధైర్యం గురించీ డంబాలు కొట్టుకోవడం వాళ్లకూ అలవాటే.

అందరికంటె ముందు కేకలు వేసింది గోరువంక. అతను పిచికల యిరుగు పొరుగులలోకల్లా దూరాన వుండి

నాడు. కానీ ప్రమాదం సూచించే అతని కేకలు చిక్‌కు వినిపించినాయి.

“విన్నావా!” అని చిక్ చిరికాకు కేకవేసినాడు. “గోరువంక కేకలు వేస్తున్నాడు, ప్రమాదం ముంచుకొచ్చిందన్నమాట!”

చిక్ చెప్పింది నిజమే. యేదో భయంకరమైన జంతువు వాళ్ల దగ్గరికి వస్తూవుండినాడు. గోరువంక తర్వాత పాలపిట్ట కేకలు వేసినాడు, ఆ తరువాత కవుజు కేకలు వేసినాడు. చిక్‌కు నాలుగు చెట్లు అవతలే కవుజు వుండేది. అతనికి శత్రువు కనిపించినాడంటే, ఆ శత్రువు చాలా దగ్గర వున్నా డన్నమాట.

చిరికా చెట్టు తొర్రలోనుండి బయటికి వచ్చి, ఒక కొమ్మమీద చిక్ పక్కన కూర్చుంది. యిరుగు పొరుగులు ప్రమాదం గురించి వాళ్లకు హెచ్చరిక యిచ్చినారు, దానిని యెదుర్కోడానికి వాళ్లు సిద్ధపడినారు.

పొదలలో యెర్ర బొచ్చు జంతువు వాళ్లకు కనిపించినాడు. కాసేపట్లో వాళ్లు తమ శత్రువును గుర్తుపట్టినారు — యెర్ర పిల్లి బయలులోకి వచ్చినాడు. యిరుగు పొరుగులు కేకలు వేసి తన రాకను తెలియజేసినారనీ, చిరికా గూట్లో దొరికే అవకాశం లేదనీ పిల్లికి అర్థమైంది. అందుకని అతను చాలా కోపంగా వుండినాడు.

హఠాత్తుగా అతని కొన తోక కదలసాగింది. అతను కండ్లు చిట్లించినాడు: పిల్లికి చెట్టు తొర్ర కనపడింది. అర డజను పిచిక గుడ్లు మంచి విందు భోజన మౌతాయి అతనికి. పిల్లి పెదవులు నాక్కున్నాడు, చెట్టెక్కి తొర్రలో పంజా దూర్చినాడు.





చిక్, చిరికా వనం దద్దరిల్లేటట్లు గోల చేసినారు, కాని యెవరూ వాళ్లకు సాయం రాలేదు. యిరుగు పొరుగులు తమ తమ చెట్లమీద కూర్చొని, భయంతో అరచినారు. ప్రతి జంటా తమ గూడు యేమౌతుందో అని భయపడినారు.

పిల్లి తన వాడి గోళ్లతో పిచిక గూడును పట్టి తొర్రలోనుండి లాగినాడు.

కానీ యీసారి పిల్లికి అదృష్టం లేదు — గూట్లో గుడ్లు లేవు, పిల్లి యెంత వెదకినా యేమీ దొరకలేదు.

అతను గూటిని జారవిడిచి, కిందికి దిగివచ్చినాడు. పిచికలు అలాగే కేకలు వేస్తూవుండినారు.

పిల్లి పొదల వద్దకు నడిచిపోయి, వాళ్లవైపు తిరిగి చూసినాడు.

"సరేలే, యెన్నాళ్లు తప్పించుకుంటారో చూస్తానుగా! మీరు యింకొక గూడు కట్టుకోండి, యింకొక చోట పిల్లల్ని కనండి. అయినా, వచ్చి అన్నిటినీ తినేస్తాను. పిల్లలతో పాటు మిమ్మల్నీ తినేస్తాను!" అన్నట్లు వుండినాయి అతని చూపులు. అప్పుడు పిల్లి యెంత భయంకరంగా అరిచినాడంటే, చిరికా భయంతో వణకిపోయింది.

పిల్లి వెళ్లిపోయినాడు. ధ్వంసమైన తమ గూడు దగ్గర దుఃఖిస్తూ, చిక్, చిరికా మిగిలినారు.

చివరకు చిరికా అన్నది:

"చిక్, కొద్ది రోజుల్లో నేను తప్పకుండా మళ్లీ గుడ్లు పెడతాను. త్వరగా వెళ్లి, నదికి అవతల, పిల్లికి అందుబాటులో లేని చోట గూడు కట్టుకుందాం."

నదిమీద వంతెన వుందనీ, ఆ వంతెనమీద నడిచి పిల్లి తరచుగా నదిని దాటుతుంటాడనీ చిరికాకు తెలియదు. చిక్‌కు కూడా తెలీయదు.

''పోదాం పద'' అని ఒప్పుకున్నాడు చిక్.

యిద్దరూ యెగిరిపోయినారు.

కాసేపట్లో వాళ్లు సరిగ్గా యెఱ్ఱ గుట్టవద్దకే వచ్చినారు.

''రండి! రండి!'' అని స్వాలోలు కేకలు వేసినారు, తమ స్వాలోల భాషలో. ''మా యెఱ్ఱ గుట్టమీద అందరమూ ఒకే కుటుంబం లాగ జీవిస్తాము!''

''మీరు మాతో కొట్లాడుతారేమో'' అన్నాడు చిక్.



''యెందుకు కొట్లాడుతాం?'' అన్నారు స్వాలోలు. ''నదిమీద బోలెడు రెక్కల పురుగులు ఆడుతుంటాయి, అందరికీ తగినన్ని. ఖాళీ బొరియలు కూడా బోలెడున్నాయి. మీకు నచ్చింది యేరుకోండి.''

''కాకులూ, గద్దలూనో?'' చిక్ అడిగినాడు.

''గద్దలు మిడతలనూ, పొలంలో యెలకలనూ పట్టుకుంటారు. వాళ్లు మా జోలికి రారు. అందరమూ స్నేహితులం.''

చిరికా చెప్పింది:

''నా మాట విను, చిక్. మనం యింత దూరం వచ్చినాం, యింతకంటె అందమైన స్థలం యెక్కడా కనిపించలేదు. యిక్కడే వుండిపోదాం.''

''సరే'' అన్నాడు చిక్. ''ఖాళీ బొరియలు వున్నాయి గనుక, యెవరూ కొట్లాటకు రారు గనుక, యిక్కడే వుందాంలే.''

వాళ్లు దగ్గరికి పోయినారు. గద్దలూ, కాకులూ వాళ్లను పట్టించుకోలేదు.

మరీ లోతు లేకుండా, కాస్త వెడల్పు ద్వారం గల బొరియ కోసం వాళ్లు వెదకినారు. అలాంటివి రెండు కనిపించినాయి, దగ్గర దగ్గర.

ఒక బొరియలో వాళ్లు గూడు కట్టుకున్నారు, అందులో చిరికా గుడ్లు పెట్టి, పొదగసాగింది. మరొక దానిలో చిక్ రాత్రిపూట నిద్రపోయేవాడు.

స్వాలోలూ, కాకులూ, గద్దలూ చాలా కాలం కిందటే తమ పిల్లలను పొదిగినారు. చిరికా ఒక్కతే ఓపికగా తన చిన్న చీకటి బొరియలో ఒంటరిగా కూర్చుంది. ప్రొద్దుననుండి సాయంత్రందాకా ఆమెకు చిక్ తిండి తెస్తూ వుండినాడు.

రెండు వారాలు గడిచినాయి: యెర్ర పిల్లి రాలేదు. పిచికలు అతన్ని మరిచిపోయినారు.

చిక్ తన పిల్లల కోసం తహతహతో యెదురుచూస్తూ వుండినాడు. అతను చిరికాకు పురుగునో, యీగనో తెచ్చినప్పుడల్లా అడిగేవాడు:

''వాళ్లు లోపలనుండి పొడుస్తున్నారా?''

''యింకా లేదు.''

''త్వరలో పొడుస్తారు గదూ?''

''యిక అట్టే ఆలస్యం లేదులే'' అని చిరికా అతనికి నమ్మజెప్పింది.

ఒక రోజు ఉదయం చిరికా పక్క బొరియలో వున్న చిక్‌ను కేకవేసింది:

''త్వరగా రా! అప్పుడే ఒకడు పొడుస్తున్నాడు!''

చిక్ పరుగు పరుగున గూటి వద్దకు పోయినాడు. గుడ్డులోపలినుండి పిచిక పిల్లవాడు తన బలహీనమైన ముక్కుతో పొడవడం అతనికి సన్నగా వినిపించింది.



చిరికా జాగ్రత్తగా పిల్లవానికి సాయం చేసింది: గుడ్డు పెంకును అక్కడక్కడ పగలగొట్టింది.

కొద్ది నిముషాల తర్వాత పిల్లవాడు గుడ్డులోనుండి చూసినాడు. అతను చాలా సన్నగా వుండినాడు, ఒంటి మీద బొచ్చు లేదు, కండ్లు మూసుకపోయి వుండినాయి.

చాలా సన్నని మెడమీద పెద్ద తలకాయ వుండింది.

''యెంత చిత్రంగా వున్నాడు!'' అన్నాడు చిక్ ఆశ్చర్యంతో.

చిరికాకు కోపం వచ్చి, అన్నది:

''చిత్ర మేముంది! బాబు యెంతో బాగున్నాడు. అసలు నీ కిక్కడ యేం పని వుంది? యీ గుడ్డు పెంకును తీసుకపోయి, యెక్కడైనా దూరాన పారవేసిరా.''

చిక్ ఆ పెంకు ముక్కలు ఒకటొకటే మోసుకపోతూవుండగా, యింతలో రెండవ పిల్లవాడూ, మూడవ పిల్లవాడూ లోపలనుండి పొడవడం ప్రారంభించినారు.

అప్పుడు యెర్ర గుట్టమీద కలకలం చెలరేగింది.

స్వాలోల గావు కేకలు బొరియలో వున్న పిచికలకు వినపడినాయి.

చిక్ బయటికి దూకి, యెర్ర పిల్లి కొండ పేటు యెక్కుతున్నాడని వెంటనే వార్త తెచ్చినాడు.

''అతను నన్ను చూసినాడు!'' అంటూ చిక్ అరచినాడు. ''కాసేపట్లో యిక్కడికి వస్తాడు. మనల్నీ, మన పిల్లల్నీ బయటికి లాగుతాడు. త్వరగా యెక్కడికైనా పారిపోదాం పద!''

''నేను రాను'' అన్నది చిరికా, యేడుపు గొంతుతో. ''నా బాబులను వదలి నేను రాను. అయ్యేది ఔతుంది!''

చిక్ యెంత చెప్పినా చిరికా కదలలేదు.

అప్పుడు చిక్ గూట్లోనుండి బయటికి వచ్చి, పిచ్చివానిలా పిల్లిమీద దాడి ప్రారంభించినాడు. కానీ పిల్లి పైకి



యెక్కుతూనే వుండినాడు. స్వాలోలు మేఘంలాగ పైన ఆడుతూ వుండినాయి. గద్దలూ, కాకులూ గోల చేస్తూ వాటికి సాయం వచ్చినారు.

పిల్లి వడిగా పైకి యెక్కి పంజాతో బొరియ అంచు పట్టుకున్నాడు.

యిక పిల్లి తన పంజాను బొరియలోకి దూర్చి, చిరికానూ, పిల్లలనూ, గుడ్లనూ బయటికి లాగడమే తరువాయి.

ఆ క్షణంలో ఒక గద్ద పిల్లి తోకను పొడిచినాడు, మరొక గద్ద అతని తలమీద తన్నినాడు, యిద్దరు కాకులు అతని వీపుమీద తన్నినారు.

పిల్లి బాధతో మూల్గినాడు. అతను వెనక్కి తిరిగి పక్షులను తన పంజాలతో పట్టుకోడానికి ప్రయత్నించి నాడు. కానీ వాళ్లు తప్పించుకున్నారు, పిల్లి కిందికి దొర్లినాడు. అతను దొర్లకుండా ఆగడానికి చేతికి

పట్టు యేదీ దొరకలేదు. యిసుక కూడా జారుతూ వుండింది; పిల్లి అంతకంతకూ వేగంగా కిందికి దొర్లినాడు.

పక్షులకు అతను కనిపించలేదు. వాళ్లకు కనిపించిందల్లా యెర్రని దుమ్ము మేఘం. ప్లాంప్! — మేఘం నదిమీద వాలింది. దుమ్ము అణగిన తర్వాత నది మధ్యలో తడిసిన పిల్లి తల పక్షులకు కనిపించింది. చిక్ అతని పైన ఆడుతూ, అతని తలమీద తన్నినాడు.

పిల్లి నది దాటి గట్టుమీదికి పోయినాడు. నేలమీద కూడా చిక్ అతన్ని వెంటపడినాడు. పిల్లికి భయం తీరలేదు. చిక్‌ను పట్టుకునే ధైర్యం అతనికి లేకపోయింది. అతను తడిసిన తోక యెత్తుకొని యింటికి పరుగెత్తినాడు.

అప్పటినుండి యెర్ర గుట్ట దగ్గర మళ్లీ యెప్పుడూ యెర్ర పిల్లి కనిపించలేదు.





# గబగబా ఇల్లు చేరుకున్న చీమ

ఓ చీమ బర్చ్ చెట్టు చిగారు కొమ్మకంటా యెక్కింది. అక్కణ్ణుంచి కిందికి చూసింది. తన చీమల పుట్ట యెక్కడుందో దానికి సరిగ్గా కనిపించనే లేదు.

అది వొక ఆకుమీద కూర్చుని

''కాసేపు యిక్కడ విశ్రాంతి తీసుకుని తర్వాత కిందికి దిగుతాలే'' అనుకొంది.

చీమ కుటుంబంలో చాలా గట్టి నియమాలు వుంటాయి. సూర్యాస్తమయం అవుతోందీ అనగానే చీమలన్నీ యింటికి గబగబా చేరుకోవాల్సిందే. సూర్యాస్తమయం కాగానే చీమ పుట్టలో సొరంగ మార్గాలన్నీ మూసేసి అవి నిద్రపోతాయి. యే చీమ అయినా ఆలస్యంగా వొస్తే యిక రాత్రంతా ఆరు బయట గడపాల్సిందే.

సూర్యుడు అడివి వేపు వాలుతున్నాడు.

కాని యీ చీమ యింకా ఆకుమీదనే కూర్చుంది.

''అబ్బో, నాకు బోలెడు వ్యవధి వుంది. కిందికి దిగడానికి ఆట్టే సేపు పట్టదులే'' అనుకొంది.

అది కూర్చున్న ఆకు మంచిది కాదు. పండబారి, యెండిపోయింది. గాలి తెర వీచి ఆ ఆకుని కొమ్మనుంచి తుంచేసి, అడివిమీదుగా యెగరేసుకుపోయింది. నదిమీదుగా, వూరుమీదుగా యెగరేసుకుపోయింది.

చీమ ప్రాణం పోయిందనే భయపడుతూ ఆకుని కరుచుకునే వుంది.

గాలి ఆ ఆకుని వూరి అవతల మైదానం దాకా యెగరేసుకుపోయింది. అక్కడ కింద దాన్ని పారేసింది. ఆకు సరిగ్గా వో రాయిమీద పడింది. ఆ దెబ్బకి చీమ కాళ్లు నొప్పి పుట్టాయి.

''చచ్చాన్రోయ్! యిక యిల్లు చేరలేను. కాళ్ళు నొప్పి లేకపోతే యిట్టే యింటికి పోదును, యేమంటే యిదంతా చదునుగా వుండే ప్రాంతమే. కాని కాళ్ళు నొప్పిగా వున్నాయి. నేను వెళ్ళలేను. కాళ్ళు తడబడతాయి'' అని నేలమీద పడుకుని అది అనుకొంది.

చీమ చుట్టూతా చూసింది. దానికో ఆకుపురుగు కనిపించింది. అది మిగతా అన్ని క్రిముల్లాగానే వుంది. కాని దానికి కాళ్ళు వున్నాయంతే.

''ఆకుపురుగు, ఆకుపురుగు! నన్నింటికి తీసుకెళ్లవూ? నా కాళ్లన్నీ నొప్పి పెడుతున్నాయి'' అంది చీమ. ''నన్ను కుడతావు బాబూ నువ్వు, కుడతావా?''

''వుహూఁ.''

''సరే అయితే, పద.''

చీమ దాని వీపుమీద యెక్కింది. ఆకుపురుగు వీపు వొంచితే వెనక కాళ్ళు ముందుకు వచ్చాయి. వాటిని ముందు కాళ్ళ తగిలేటట్టు తెచ్చి పెట్టుకుంది. అప్పుడు దాని తోక భాగం సరిగ్గా దాని తల వెనక్కి వచ్చింది. ఆ తర్వాత వున్నట్టుండి ముందు కాళ్లని నేలమీదనుంచి పైకి గాలిలోకి నిటారుగా నుంచునే దాకా యెత్తింది. అప్పుడు కర్రలాగా నిబ్బరంగా కిందికి చాచుకుని పడింది. తన యెత్తు కొలత మేరకి నేలమీద చాచుకుని మళ్లీ వీపు వొంచి పైకి లేచింది. ఆ రకంగా అది ముందుకు నేలంతా కొలుచుకుంటూ వెడుతున్నట్టుగా సాగింది. మీద కూచున్న చీమకేమో పైకీ కిందికీ లేస్తూ దిగుతూ వున్నట్టు వుంది. కాళ్లు పైకీ, తల కిందికీ మళ్లీ మళ్లీ వేస్తూ పడుతూ వున్నట్టే వుంది.

''యిలా అయితే చచ్చానన్నమాటే! ఆగు, లేకపోతే నిన్ను కరుస్తా'' అంది.





ఆకుపురుగు ఆగింది. నేలమీదకంటా సాగిల పడింది. చీమ కిందికి దూకింది. దానికి వూపిరి ఆడలేదు.

చుట్టూతా చూసింది. గడ్డికోసిన పచ్చిక బీడు కనిపించింది. పొడుగు కాళ్లయ్య అటుపోతూ వుండడం కనిపించింది. దాని కాళ్లు బాగా పొడుగ్గా వున్నాయి. ఆ కాళ్ల మధ్య దాని తల పైకీ కిందికీ లేస్తూ పడుతూ వుంది.

"సాలీడూ, సాలీడూ! నన్ను మా యింటికి తీసికెళ్లవూ? నా కాళ్లన్నీ నొప్పిగా వున్నాయి."

"సరే అయితే, రా."

సాలీడు మోకాలి దాకా చీమ యెక్కవలసి వచ్చింది. అప్పుడు మోకాలమీదనుంచి దాని వీపుమీదకి దిగాల్సివచ్చింది. యేమంటే పొడుగు కాళ్లయ్య మోకాళ్లు దాని వీపుకంటే యెత్తులో వున్నాయి మరి.

సాలీడు తన కాళ్లని యిటూ అటూ యెటుపడితే అటు కదిలిస్తూనే వుంది. దాని యెనిమిది కాళ్లూ పైకీ కిందికీ వూగిపోతూనే వున్నాయి. చీమకేమో తల తిరిగిపోతోంది. సాలీడు యింతా చేసి గబగబానూ పోవడం లేదు. నిజం చెప్పాలంటే అది తన కడుపుని నేలమీద యీడ్చుకుంటూ పోతోంది.

చీమకి యీ వూగడం సవారీతో విసుగొచ్చేసింది. సాలీడుని కుడదామా అనుకుంటోంది, యింతలో సాఫీగా వున్న దారిమీదకి చేరాయవి.

సాలీడు ఆగింది. ''దిగు! అదుగో ఆ పురుగు కనిపిస్తోందా? అది పేడ పురుగు. నాకంటే వేగంగా వెడుతుంది'' అని చెప్పింది.

చీమ కిందికి దిగింది.

''పేడ పురుగూ, పేడ పురుగూ! నన్నింటికి తీసుకెళ్లవూ? నా కాళ్లన్నీ నొప్పిగా వున్నాయి'' అంది.

''సరే, రా. సవారీ పోదువు గాని'' అందది.

చీమ పేడ పురుగు వీపుమీదకి యెక్కీ యెక్కగానే అది చాలా వేగంగా పరిగెత్తడం మొదలుపెట్టింది. పేడ పురుగు కాళ్లు గుర్రం కాళ్లల్లాగా నిటారుగా వున్నాయి. ఆరు కాళ్ల వాహనం తూగుతూ వున్నట్టుగా దౌడు తీసింది.

త్వరలోనే వో బంగాళా దుంప పొలం దగ్గరికి అవి చేరుకున్నాయి.

''దిగు, దిగు. యీ యెగుడు దిగుడు చాళ్లల్లో నేను పోలేను. నా వల్ల కాదు యెక్కా దిగా. యింకో సవారీ చూసుకో'' అంది పేడ పురుగు.

చీమకి చేసేదేమీ లేకపోయింది. దిగాల్సి వొచ్చింది.

బంగాళా దుంప మొక్కలైతే చీమకి మరో అడివిలాగే కనిపించాయి. దాన్ని దాటాలంటే దానికి రోజుకి రోజు పట్టేదే, కాళ్లు నొప్పి పెట్టకపోయినా కూడా. త్వరలో సూర్యాస్తమయం అవబోతోంది.



యింతట్లోకీ చీమకి కీచుమంటూ కూత వినిపించింది.

"రా, చీమా, నా వీపుమీదకి యెక్కు, పోదాం" అని మాటలు వినిపించాయి.

యెవరా అని చీమ అటు చూసింది. దానికి మిణ్ణల్లి కనిపించింది. తనకంటే చిన్నగా వుంది అది.

"నువ్వా నన్ను తీసుకుని నేలపైన యెగరగలిగిన దానివి! చాలు! చూడు యెంత చిన్నగా వున్నావో."

"నువ్వు మహా పెద్దగా వున్నావా యేమిటి? రా, రా, వీపుమీదకి యెక్కు."

మొత్తంమీద చీమ మిణ్ణల్లి వీపుమీదకి యెక్కగలిగింది. దాని కాళ్లు పక్కలకి వేలాడేయి గాని మొత్తంమీద ఫరవాలేదు.

"యేం సరిగా వుందా?"

"అనుకుంటా మరి."

"గట్టిగా పట్టుకో."

మిణ్ణల్లి బలమైన వెనక కాళ్లని ముడుచుకుంది. అవి ముడుచుకోగానే చిన్న స్ప్రింగుల్లాగా అయేయి. ఠకా! అవి తెరుచుకున్నాయి. మిణ్ణల్లి వో చాలు వరస పైన గెంతింది. ఠకా! మళ్లీ యింకో వరసకి చేరాయి. ఠకా! మూడో వరస. అవి ఆ రకంగా కంచె దాకా గెంతుకుంటూ చేరాయి.

"కంచె పైనుంచి యెగరగలవా?" అని చీమ అడిగింది.

"వుహుఁ, అది చాలా యెత్తుగా వుంది. గొల్లభామని అడుగు. అది యెగరగలదు."





“గొల్లభామా! గొల్లభామా! నన్నింటికి తీసుకెళ్లవూ? నా కాళ్లు నొప్పిగా వున్నాయి.”

“సరే, రా.”

చీమ గొల్లభామ వీపు యెక్కింది.

గొల్లభామ వెనక కాళ్లు సగం ముడిచి తర్వాత వెంటనే చాచింది. దాంతో అది గాలిలోకి యెగిరింది, మిణ్ణల్లిలాగా. కాని యెగిరాక రకామని చప్పుడు చేస్తూ రెక్కలు విప్పి కంచెమీదుగా యెగిరిపోయింది. అవతలి వేపున అవి మెల్లిగా నేలమీదకి దిగాయి.

“నేనింత వరకూనే వస్తా. యీ పైనుంచి నువ్వే వెళ్లాలి” అంది గొల్లభామ.

చీమకి యెదర నది కనిపించింది. ఆ నదిమీద యీది వెళ్లడం తన తరం కాదు.

సూర్యుడు యింకా వాలిపోతున్నాడు.

''యీా నదిమీదనుంచి నేనూ యెగరలేను, యిది చాలా వెడల్పుగా వుంది. కాని, వుండు, నీటి పురుగుని పిలుస్తాను. నిన్నది నది దాటిస్తుంది'' అని గొల్లభామ చెప్పింది.

అప్పుడు గొల్లభామ దేన్నో కోసినట్టు చప్పుడు చేసింది. కొంచెం సేపట్లోనే కాళ్లు వున్న చిన్న పడవ వొకటి నీటిమీద జారుకుంటూ వచ్చింది. అది దగ్గరయ్యే కొద్దీ చీమకి పడవలాగా కనిపించనే లేదు. తీరాచూస్తే అది నీటి పురుగు.

''నీటి పురుగూ, నీటి పురుగూ, నన్ను మా యింటికి తీసికెళ్లవూ? నా కాళ్లన్నీ నొప్పిగా వున్నాయి'' అంది చీమ.

''సరే, రా అయితే.''

చీమ నీటి పురుగు వీపుమీదకి యెక్కగానే అది నీటిమీద బయల్దేరింది, నేలమీద నడుస్తున్నట్టుగా పోయింది.

అప్పటికి దాదాపు సూర్యాస్తమయం అయిపోయినట్టే వుంది.

''బాబ్బాబు, నీకు పుణ్యం వుంటుంది కొంచెం గబగబా వెళ్లవూ? వూఁ? ఆలస్యం అయితే నన్ను రానివ్వరు మా వాళ్లు.''

''ప్రయత్నిస్తా'' అంది నీటి పురుగు. నీటిమీద గబగబ వెనక కాళ్లతో తోసుకుంటూ, ముందుకు జారిపోతూ మంచుమీద స్కేటింగ్ చేస్తున్నట్టుగా పోయింది. ఆట్టే సేపవకుండానే అవతలి వొడ్డుకు చేరాయి.

''నేలమీద నడవలేవా?''

''ప్చ్! నడవలేను. చాలా కష్టం. యేమంటే నా కాళ్లు అక్కడ జారుకుంటూ పోలేవు. అదీగాక యెదర అడివి వుందాయిరి. ఆఁ, మరో వాహనం చూసుకో.''





చీమ పైకి చూసింది. చెట్లు ఆకాశాన్ని తాకుతున్నాయి. సూర్యుడు చెట్ల వెనక మణిగాడు. అయ్యో! యిక [illegible]

''అదుగో నీ కోసం అన్నట్టు వో వాహనం వస్తోంది'' అని నీటి పురుగు చెప్పింది. అది పెద్ద మిణుగురు పురుగు. యిదా తనని తీసికెళ్లే వాహనం! కాని చేసేది యేమీ లేక చీమ నీటి పురుగు సలహా మేరకి దాన్నే అడిగింది. ''మిణుగురు పురుగూ, మిణుగురు పురుగూ! నన్నింటికి తీసికెళ్లవూ? నా కాళ్ళు నొప్పిగా వున్నాయి.''

''యెక్కడ మీ యిల్లు?''

''అడివి అవతల చీమల పుట్ట.''

''చాలా దూరమేనే! సరే, కానీ, రా.''

చీమ దాని వీపుమీదకి గట్టిగా వున్న చోట యెక్కింది.

''యేం సరిగా వుందా?''

''ఆఁ.''

''యెక్కడున్నావ్?''

''వీపుమీద.''

''నా మొహంలా వుంది! తల దగ్గరికి వచ్చి కూర్చో.''

చీమ దాని తల దగ్గరకంటా వచ్చి కూర్చుంది. మంచి పని చేసింది తను. లేకపోతేనా! యేమంటే మరు

క్షణం మిణుగురు పురుగు వీపు రెండుగా చీలింది. తిరగేసిన తెడ్డుల్లాగా వున్న రెండు గట్టి రెక్కల కిందనుంచి వేరే రెక్కలు వచ్చేయి. అవి పెద్దవి. పారదర్శకంగా వున్నాయి.

''హుఫ్! హుఫ్! హుఫ్'' అంటూ మిణుగురు పురుగు యేదో మోటారు ఇంజన్‌ని స్టార్ట్ చేస్తున్నట్టు ఆయాసపడుతూ పోయింది.

''కొంచెం గబగబా పోలేవా? నీకు పుణ్యం వుంటుంది'' అని చీమ బతిమాలింది.

మిణుగురు పురుగు జవాబు చెప్పలేదు. వూరికే 'హుఫ్' అంటూనే వుంది. తర్వాత పారదర్శకంగా వున్న చిన్న లోపలి రెక్కలు కదలడం మొదలుపెట్టాయి. గబగబా కదిలేయి. జ్! జ్! టక్ టక్ టక్! మిణుగురు పురుగు రకామని గాలిలోకి నిటారుగా లేచింది, సీసా బిరడా టప్‌మని లేచినట్టు. చెట్లపైనుంచి యెత్తులో యెగిరింది అది.

ఆ యెత్తునుంచి చూస్తే చీమకి సూర్యగోళం భూమిని తాకుతున్నట్టు కనిపించింది. మిణుగురు పురుగు యెంత వేగంగా పోతోందంటే చీమకి వూపిరి ఆడలేదు. జ్! జ్! టక్, టక్, టక్! మిణుగురు పురుగు గాలిలో తుపాకీ గుండులాగా దూసుకుపోతోంది.

కింద అడివి తటుక్కున కనిపించి మాయమైపోయింది.

కింద తనకి తెలిసిన బర్చ్ చెట్టూ, దాని మొదట్లో చీమల పుట్టా చీమకి కనిపించాయి. బర్చ్ చెట్టు చిటారు కొమ్మ చేరగానే మిణుగురు పురుగు మోటారు ఆపు చేసి, వో కొమ్మమీదకి తపామని వాలింది.

''నేను కిందకి యెలా దిగను? నా కాళ్లు నొప్పి పెడుతున్నాయి. నా మెడ విరిగి చక్కాపోతుంది.''

మిణుగురు పురుగు పట్టు రెక్కల్ని ముడుచుకుంది. వాటిపైన గట్టి రెక్కల్ని కప్పుకుంది. గట్టి తెడ్లలాగా వున్న రెక్కల కింద పట్టు రెక్కల్ని దోపుకుంది.

అది వో క్షణం సేపు యేమీ మాట్లాడకుండా మౌనంగా వుండిపోయింది. ''నాకు తెలీదు యెలా దిగుతావో. నిన్ను నేను తీసికెళ్లలేను. మీ చీమలు మా చెడ్డగా కుడతాయి. నీ యిష్టం నీ దారి నువ్వు చూసుకో'' అంది.

చీమ చెట్టు కింద వున్న తన యింటికేసి చూసింది. తర్వాత సూర్యుడికేసి చూసింది. అప్పుడే భూమి సగం సూర్యుణ్ణి మింగేసింది.

చీమ చుట్టూతా చూసింది. దానికి కనిపించిందల్లా కొమ్మలూ, ఆకులూ, ఆకులూ కొమ్మలూ మాత్రమే. తను వేళ మించకుండా యిల్లు చేరుకోలేదు. కిందికి దూసుకుపోనూ లేదు.

ఇంతట్లోకీ దానికి దగ్గర్లో వున్న ఆకుమీద వో పట్టు పురుగు కనిపించింది. అది వో రెమ్మ చుట్టూతా పట్టు దారాన్ని అల్లుతూ, చుడుతూ వుంది.

''పట్టు పురుగూ, పట్టు పురుగూ నేను కిందికి దిగడానికి నాకు సాయం చెయ్యవూ? ఓ క్షణం మాత్రమే నాకు వ్యవధి వుందిక. ఆలస్యం అయితే ఆరు బయట యీ రాత్రంతా నాకు జాగారమే గతి'' అంది చీమ.

''నన్ను విసిగించకు. కనబడ్డంలా నా చెయ్యి వూరికేలేదని.''

''అందరూ నాకు సాయం చేశారు. ఒఖ్ఖళ్లు కూడా నన్ను తరిమెయ్యలేదు. నువ్వు ఒక్క దానివే నాకు సాయం చెయ్యడం లేదు'' అని చీమ పట్టు పురుగుమీదకి యెగిరి దాన్ని కుట్టింది.

పట్టు పురుగు 'ఆఁ' అని ముక్కుమీద వేలేసుకుంది. లుంగ చుట్టుకుపోయి ఆకుమీదనుంచి దొర్లుకుంటూ కిందకి దూకింది. చీమ దాన్ని గట్టిగా పట్టుకుంది.

అవి ఆట్టే దూరంలో పడలేదు, యింతట్లోకీ పట్టు దారం యిక బారు సాగక అవి ఆగిపోయాయి. ఆ దారం యెత్తులో వున్న కొమ్మకి తగులుకుని వూగులాడింది.

చీమా, పట్టు పురుగూ వుయ్యాలా వూగినట్టు వూగాయి. ఆ దారం అలా అలా సాగుతూనే వుంది; పట్టు పురుగు పొట్టలోనుంచి జారుతూ, చాచుకుంటూ చిరిగిపోకుండా సాగుతూనే వుంది.

చీమ, పట్టు పురుగు యింకా యింకా దగ్గరసా నేలమీదకి వచ్చేయి.

యీ లోపున చీమల పుట్టలో వున్న చీమలు సొరంగాల ద్వారాలు మూసేస్తూ వున్నాయి. ఒక్కటి యింకా మూయకుండా మిగిలింది.

మన చీమ పట్టు పురుగుమీదనుంచి కిందకి పాకి లోపలికి దూసుకుపోయింది.

సరిగ్గా ఆ సమయంలో సూర్యుడు అస్తమించాడు.





# మొదటి వేట

పెరట్లో కోడిపిల్లల్ని తరిమి తరిమి కొట్టడంతోటి కుక్క పిల్ల పప్పీకి మొహం మొత్తింది.

''అడివి పిట్టల్ని, జంతువుల్ని వాటి జాడపట్టి పసికట్ట బోతున్నాను'' అనుకొంది అది.

అంచేత అది గేటు కిందనుంచి మెల్లిగా జారి పచ్చికమైదానం కేసి దౌడు తీసింది.

అది అలా పరిగెడుతూ వుంటే అడివి జంతువులూ, పిట్టలూ, పురుగులూ దాన్ని చూశాయి. ప్రతీదీ తనకిగా తను అనుకొంది:

''నేను దీనికి ఠోకరా యిస్తాను'' అనుకొంది తుంపాడి పక్షి.

''నేను దీనికి ఆశ్చర్యం కలిగిస్తాను'' అనుకొంది తురాయి పక్షి.

''నేను దీన్ని ఝుడిపిస్తాను'' అనుకొంది వంకరమెడ పిట్ట.

''నేను దీని కంట పడకుండా తప్పించుకుంటాను'' అనుకొంది బల్లి.

''మేము దీన్నుంచి దాంకుంటాం'' అనుకున్నాయి గొంగళీ పురుగులు, సీతాకోక చిలకలు, మిడతలు.

''నేను దీన్ని తరిమేస్తాను'' అనుకొంది కందిరీగ.

''యెవళ్ల పద్ధతిలో వాళ్ళుగా, మేమందరమూ కలిసి నిలబడతాం'' అని అవన్నీ అనుకున్నాయి.

యీ లోపున పప్పీ చెరువు దగ్గరికి పరిగెత్తుకెళ్లింది. రెల్లు పక్కన ఒంటి కాలిమీద నుంచున్న తుంపాడి పక్షిని చూసింది. నీళ్లు దాని మోకాలు దాకా వున్నాయి.

---

* తెలుగు అనువాదం ''రాదుగ'' ప్రచురణాలయం, 1984.



''ఓహో! నేను దీన్ని తక్షణం పట్టేస్తాను'' అనుకొంది పప్పీ. ఆ తుంపాడి పక్షి వీపుమీదకి యెగరడానికి అది రెడీగా వుంది.

కాని ఆ తుంపాడి పక్షి పప్పీని చూసి రెల్లులోకి విసవిసా వెళ్లిపోయింది.

చెరువుమీదనుంచి గాలి విసురుగా వీస్తోంది. ఆ రెల్లు

వెనక్కీ ముందుకీ

వెనక్కీ ముందుకీ

వంగి వూగులాడుతోంది.

పప్పీ కళ్లముందు గోధుమరంగూ, పసుప్పచ్చ చారలూ

వెనక్కీ ముందుకీ
వెనక్కీ ముందుకీ

కదలాడాయి.

పసుపుపచ్చ, గోధుమరంగు చారల తుంపాడి పక్షి రెల్లులో నుంచుంది. అది

వెనక్కీ ముందుకీ
వెనక్కీ ముందుకీ

వూగులాడుతూన్నట్టు నుంచుని వుంది.

పప్పీ చాటంత కళ్లు చేసుకుని అదేలోకం చూసింది. కాని దానికి రెల్లులో వున్న తుంపాడి పక్షి కనపడలేదు.

''హుమ్, తుంపాడి పక్షి నాకు టోకరా యిచ్చింది. వట్టి రెల్లులోకి దూకనా నేను! యింకో పిట్టని పట్టుకుంటా పోయి'' అనుకొంది అది.





అది గుట్టమీదకి పోయి, చుట్టూతా పరకాయించి చూసింది. అక్కడ నేలమీద తురాం పక్షి కూర్చుని వుంది. ఆ పక్షి తన తురాయిని కొంచెం సేపు విప్పుతూనూ, కొంచెం సేపు ముడుచుకుంటూనూ వినోదిస్తోంది.

''ఆహా! నేను యీ క్షణంలోనే యీ గుట్టమీదనుంచి దానిమీదకి లంఘిస్తాను'' అనుకొంది పప్పీ.

కాని తురాయి పక్షి నేలమీద పడి, రెక్కలు చాచి, తోక విప్పి, ముక్కుని గాలిలో యెత్తింది.

పప్పీ గడ్లప్పగించి చూసింది. అసలు అక్కడ పక్షేదీ! ఒక వంకర సూది పొడుచుకుని ముందుకు వస్తూ వున్న నానా రంగుల పీలిక ఒకటి మాత్రం అక్కడ వుందంతే.

పప్పీకి ఆశ్చర్యం కలిగింది. తురాయి పక్షి యేమైనట్టు?

''యీ రంగుల పీలికని నిజంగా పక్షి అని నేననుకున్నానా? తొందరగా పోతాను, ఓ చిన్న పిట్టని పట్టు కుంటాను'' అని అనుకొందది.

అది ఒక చెట్టు దగ్గరికి ఆర్భాటంగా పోయింది. మరి నిజంగానే ఒక చిన్న పిట్ట ఆ చెట్టు కొమ్మమీద కూర్చుని వుంది. అది వంకరమెడ పిట్ట.

పప్పీ దానికేసి ఒక్క ఉదుట్న దూకింది. కాని వంకరమెడ పిట్ట చెట్టు తొర్రలోకి పలాయనం చిత్తగించింది.

"ఓహో, యిప్పుడు దొరికిందిది నాకు!" అని అనుకొంది పప్పీ.

అది తన వెనక కాళ్లమీద లేచి ఆ తొర్రలోకి తొంగి చూసింది. ఆ నల్లని తొర్రలో నల్ల త్రాచు ఒకటి మెలికలు తిరుగుతూ భయంకరంగా బుసకొడుతోంది.

పప్పీ వెనక్కి గెంతింది. దాని బొచ్చు మేకుల్లా బిగిసి పోగా, అది కాలక బుద్ధి చెప్పింది. వంకర మెడ పిట్ట చెట్టు తొర్రలోనుంచి బుసకొట్టింది. అది తల వంకర తిప్పింది. తన వీపుమీద అంతా తాచుపాములాగా నల్లని యీకల చారని మెలితిప్పింది.

"ఉఫ్! యేం జడుసుకున్నాను! నా కాళ్లు కష్టంమీద సరిగ్గా అదునులో అందుకుని పరిగెత్తాయి! యిక పిట్టల వేటకో నమస్కారం. బల్లిని పట్టుకుంటాను, మెరుగు" అనుకొంది అది.

బల్లి యెండలో చలికాగుతూ, కళ్లు మూసుకొని, రాతిమీద కూర్చొంది.

మెల్లిగా పప్పీ దాని దగ్గరకి పాకి వెళ్లి, అప్పుడు గెంతి, దాని తోకని లటక్కున పట్టుకొంది.

బల్లి తన తోకని పప్పీ బిగపట్టిన పళ్ల మధ్య వదిలేసి, ఒక సారి విదిలించుకుని, రాతి కిందకి పాకి పోయింది.

పప్పీ పళ్ల మధ్య ఆ తోక గిజగిజలాడింది.

పప్పీ కస్సుమని తోకని వదిలేసింది. తను బల్లిని పట్టుకుందామని వెంబడించింది. యేదీ, అది యెక్కడికి పోయింది? ఆ బల్లి చాలా సేపు రాతి కింద, కొత్త తోకని పెంచుకుంటూ, ప్రశాంతంగా కూర్చుంది.

"సరే, బల్లి నాకు అందకుండా తప్పించుకునిపోతే పోనీ. కొన్ని పురుగుల్ని పట్టుకుంటాను" అనుకొంది పప్పీ.

అది చుట్టూతా చూసింది. కందిరీగలు నేలమీద పరిగెత్తాయి. గడ్డిలోనుంచి మిడతలు గెంతాయి. కొమ్మల మీద గొంగళీపురుగులు పాకాయి. గాలిలో సీతాకోక చిలకలు ఎగిరాయి.





పప్పీ వాటి వెనక్కాలే పోయింది. కాని వున్నట్టుండి చట్టూతా ప్రతీదీ మారిపోయింది. అది యేదో మేజిక్ బొమ్మలాగా వుంది: అన్నీ అక్కడనే వున్నాయి, కాని పప్పీకి అవి కనబడ్డం లేదు. ప్రతీదీ దాంకుంది.

మిడత గడ్డిలో దాంకుంది.

గొంగళీపురుగులు కొమ్మలమీద చాచుకుని, ఉలుకూ పలుకూ లేకుండా పడుకున్నాయి. చెట్టు కొమ్మలకీ వాటికీ తేడా తెలియలేదు పప్పీకి.

సీతాకోక చిలకలు రెక్కలు ముడుచుకుని చెట్లమీద వాలాయి. చెట్టు బెరడు యేదో, ఆకులు యేవో, సీతాకోక చిలకలు యేవో చెప్పేందుకు లేదు.

ఒక్క కందిరీగ మాత్రం నేలమీద పాకింది. దాంకోలేదు.

పప్పీ దాని వెంటబడింది. దాన్ని లటక్కున పట్టుకోవాలనుకుంది. కాని కందిరీగ ఠక్కున ఆగి, మురికి నీళ్లని ముక్కులోనుంచి పప్పీ కేసి చయ్యని పిచికారీ చేసింది. సరిగ్గా పప్పీ మొహంమీదకి మురికి నీరు చిమ్మింది.

పప్పీ కుయ్యోమని అరిచి సుళ్లు తిరిగింది. తోక ముడిచేసి పచ్చికమైదానం మీదుగా, గేటు కిందనుంచి, పరిగెత్తింది.

అది తన గూట్లో దాంకుని, చాలా సేపు తన ముట్టెని బయటపెట్టడానికి కూడా భయపడిపోయింది.

కాని ఆ జంతువులూ, పక్షులూ, పురుగులూ మరో సారి, ప్రతీదీ తన సంగతి తను చూసుకుంటూ, తమ పనుల్లోకి వెళ్లిపోయాయి.



